చులకనగా తన కృపను ప్రముఖముగా చెప్పుచున్నారు. యిందు పాత్రపరిశీలనం.

భావము. సర్వేశ్వరుని కృపాగుణము యొక్క మహిమను విపులముగా అనుగ్రహించబూని యీ శ్లోకమున దానికి నడుము కట్టుచున్నారు. "యః కశ్చిదేవ" అను ముందటి నాల్గవ శ్లోకముతోడ ఏకవాక్యముగా గ్రహింపవచ్చును. కృపవలన అత్యంతభీతము కాగల క్షమాగుణము తాను కలుపుకొని యిట్లు భావించుచున్నారు. సర్వేశ్వరుడు, తన కృపచేతనే అందరిని యంగీకరించి రక్షింపవచ్చు, భావించినచో సర్వముక్తిప్రసంగము సంభవించును. తన యభిప్రాయమును సరిదిద్ది. కొందరిని రక్షించుటయు కొందరిని త్యజించుటయు అంగీకరించినచో వైషమ్యనైర్ఘృణ్య ప్రసంగమేర్పడును. ఈ రెండు ఆపత్తులును రాకుండ, శాస్త్రములను అవతరింపజేసి, అందు పాపనిబర్హణమునకు తగిన ప్రాయశ్చిత్త ప్రకారములను తెలిపి, యీవిధముగా తన కృపాగుణమును నిలుపుకొను విధముగా ఈ శ్లోకమున అనుగ్రహించుచున్నారు.

(అనాదిభవసంభవ వాసనాత్మైః పాపైః) సంసారచక్రము భ్రమింపనారంభించినది యీనాడు నిన్ననా కాదు గదా! అనాదికాలముగా గదా జనన-మరణములను నడచుచున్నవి! వానియందు వాసన దృఢమైయుండుటవలన దాని బలముతో ఏకైకపాపములు పెరుగుచునే యుండును గదా! (దుః ఖితయు! ఖలయు క్షేత్ర వాస జన్తుః) చేసిన పాపములు ఫలమును ఇచ్చియే తీరును గాబట్టి పాపఫలమైన నరకాది వ్యసనములలో మోకాలబంటి దిగబడువాడగును చేతనుడు. ఇట్లు సంసారము కూడ తప్పక, అందు పాపవాసనయును తప్పక, దాని వలన పాపమును ఆచరించుటయును తప్పక, దాని ఫలముగా నరకాది వ్యసనానుభవము కూడ తప్పక యుండినచో అతడు గట్టునెక్కుటెట్లు? యెవరి? ఏనాటిదల ఆ మార్గము ఉత్తరార్థమందు చెప్పబడుచున్నది. చేసిన పాపముల ఫలము అవశ్యముగా అనుభవింపవలెననియు, అను నిర్బంధము లేదు గదా! "తాపాదుపరమాత్ ప్రాయశ్చిత్తైస్సుఖీభవేత్॥ తత్పూర్వకాచ్ఛాపదశా వశ్యేన స్వనిపాదశః॥" అనురీతిగా ప్రాయశ్చిత్తానుష్ఠానము వలన అవి తొలగిపోవును గనుక అట్టి ప్రాయశ్చిత్తములను గూడ శాస్త్రములద్వారా తెలియజేయుట, చేతనులను తరింపజేయుటకొరకే గదా! ఇదియును కృపాకార్యమే గదా! యనుచున్నారు.

శాస్త్రైరనాదినిధనైః స్మృతిభిస్తదీయ
దివ్యావతారచరితైశ్చ భయా చ దృష్ట్యా।
నిశ్శ్రేయసం యదుపకల్పయసి ప్రజానాం
సా త్వత్కృపా జలధితల్లజ వల్లభశ్రీః॥ 50.

పదవిభాగము. శాస్త్రైః, అనాదినిధనైః, స్మృతిభిః, త్వదీయ దివ్యావతారచరితైః, చ, ఉభయా, చ, దృష్ట్యా, నిశ్శ్రేయసం, యత్, ఉపకల్పయసి, ప్రజానాం, సా, త్వత్కృపా జలధి తల్లజ వల్లభశ్రీః.

మధుసూదన!, సాత్త్వికస్తు విజ్ఞేయః సవై మోక్షార్థ చింతకః" అనునది యిట్లు అనుసంధేయము.

కనుక వీనిచేత (ప్రజానాం నిశ్శ్రేయసం ప్రకల్పయసి త్వత్) చేతనులకు దేవరవారు మంచిని ప్రకార్యబ్రూయాము యనునది యెది కలదో! (సా త్వత్కృపా జలధి తల్లజ వల్లరీ(శ్రీ)) ఇదియంతయు నిర్హేతుక కృప చేతనే కదా! యనుచున్నారు. ఇకపై 'సా' అనునది స్త్రీలింగ నిర్దేశము. విధేయ ప్రాధాన్యము వలన అని గ్రహింపదగును. "శైత్యం హి యత్సా ప్రకృతిర్జలస్య" అనునది స్మరింపదగును. ఈ శ్లోకమువలన సర్వేశ్వరుడు నిర్హేతుక కృపా విభవము చేత చేయునని చెప్పబడినది.

హే వ్యాప్త! జంతుషు నిరంతర సంతతాత్మా,
పాప్మా కో నామ బత! కోఽయ మచింత్యశక్తిః ।
యస్త్వత్కృపా జలధి మప్యతివేల ఖేలం
ఉల్లంఘయ త్యకృత భాసుర భాగధేయాన్ ॥ 60.

పదవిభాగము. హే, వ్యాప్త, జంతుషు, నిరంతర సంతతాత్మా, పాప్మా, కః, నామ, బత, కః, అయం, అచింత్యశక్తిః, యః, త్వత్కృపాజలధిం, అపి, అతివేలఖేలం, ఉల్లంఘయతి, అకృత భాసుర భాగధేయాన్.

అర్థము. జంతుషు = చేతనులయందు, నిరంతర సంతతాత్మా, నిరంతరః = ఎప్పుడును, సంతతః = వ్యాపించియున్న, ఆత్మా = స్వరూపమును గలదియై, అచింత్యశక్తిః = చింతింప శక్యముకాని శక్తి కల, అయం = ఈ, పాప్మా = పాపము, కో నామ = ఏదోగదా! (ఈ పాపము క్రౌర్యము సాటిలేనిదనుట) (పాపము చేయునదేమనగా) హే వ్యాప్త, బత = ఆశ్చర్యము! యః = ఏ పాపము, అకృత భాసుర భాగధేయాన్ = చేయబడని ఉజ్జ్వలమైన భాగ్యములు గలవారిని (దౌర్భాగ్యవంతులను) అతివేలఖేలం = అతిక్రమించిన ఎల్లకల విలాసము గలిగిన, త్వత్కృపాజలధిం = దేవరవారి దయయనెడి సముద్రమును గూడ, ఉల్లంఘయతి = దాటింపజేయుచున్నదో!

ఆకాంక్ష. ఉల్లంఘయతి = దాటింపజేయుచున్నది! కః = ఏది, యః = ఏ పాపము. కాన్ = అకృత భాసుర భాగధేయాన్ = దౌర్భాగ్యవంతులను. కమపి = దేనిని గూడ? త్వత్కృపాజలధిమపి = దేవరవారి దయయనెడి సముద్రమును గూడ. త్వత్కృపాజలధిం కథంభూతం = దేవరవారి దయాసముద్రమెట్టిది? అతివేలఖేలం = అతిక్రమించిన ఎల్లగల విలాసము గలది. యః అను ప్రథమాంత కర్తృపదము, అకృత భాసుర భాగధేయాన్, త్వత్కృపాజలధిం అను ద్వితీయాంత కర్మపదములు రెండును, ఉల్లంఘయతి అను క్రియాపదమును ఉన్నవి గనుక వ్యాకరణిక కర్తరి ప్రయోగము. కో నామ = ఏదోగదా! కః = ఏది? అయం పాప్మా = ఈ పాపము. పాప్మా కథంభూతః = పాపమెట్టిది? అచింత్యశక్తిః = చింతింప శక్యముకాని శక్తి కలది. పునః కథంభూతః = ఇంకను ఎట్టిది? నిరంతరసంతతాత్మా = ఎల్లపుడును వ్యాపించియున్న స్వరూపము గలది. కేషు = ఎవరియందు? జంతుషు = చేతనులయందు.

విగ్రహ వాక్య సమాసములు. (హే, వ్యాప్త) అవ్యయములు. (జంతుషు) జంతోః, జంత్వోః, జం

త్యం. అశక్యం. అశక్యే, అశక్యాని, అశక్య శబ్దః అకారాంత నపుంసకలింగః ప్రథమైకవచనాంతః (తత్) తత్, తే, తాని, తత్ శబ్దః దకారాంత నపుంసకలింగః ద్వితీయైకవచనాంతః (కిల్బిషం) కిల్బిషం, కిల్బిషే, కిల్బిషాణి కిల్బిష శబ్దః అకారాంత నపుంసకలింగః ద్వితీయైకవచనాంతః. "పాప కిల్బిష కల్మషమ్" ఇత్యమరః. (సృజతి) సృజతి, సృజతః సృజన్తి సృజ-విసర్గే, ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది లట్ ప్రథమపురుషైకవచనాంతః (జంతుః) జంతుః, జంతూ జంతవః, జంతు శబ్దః ఉకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. "ప్రాణీ తు చేతనో జన్మీ జంతు జన్యు శరీరిణః" ఇత్యమరః. (ఇవ) తాంతావ్యయము. (క్షణార్ధే) క్షణస్య అర్ధం, క్షణార్ధం, తస్మిన్, క్షణార్ధే. షష్ఠీతత్పురుషము. క్షణార్ధే, క్షణార్ధయోః క్షణార్ధేషు. క్షణార్ధ శబ్దః అకారాంత నపుంసకలింగః సప్తమ్యేకవచనాంతః (ఏవం) అవ్యయము. (సదా) దాన్త వ్యయము. (సకల జన్మసు) సకలాని చ తాని జన్మాని, సకల జన్మాని, తేషు, సకల జన్మసు. జన్మని, జన్మనోః జన్మసు, సకలజన్మ శబ్దః అకారాంత నపుంసకలింగః సప్తమీ బహువచనాంతః (సాపరాధం) అపరాధేన సహ వర్తత ఇతి సాపరాధః, తం, సాపరాధం, తుల్యయోగ బహువ్రీహి. సాపరాధం, సాపరాధౌ, సాపరాధాన్. సాపరాధ శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (క్షామ్యసి) క్షామ్యసి, క్షామ్యథః క్షామ్యథ క్షము-సహనే ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది లట్ మధ్యమ పురుషైకవచనమ్. (అహో) అవ్యయము. (తదభసంధి విరామ మాత్రాత్) తస్మిన్ అభసంధిః, తదభసంధిః సప్తమీ తత్పురుషము. తదభసంధేః విరామః, తదభసంధివిరామః. షష్ఠీ తత్పురుషము. తదభసంధి విరామ ఏవ, తదభసంధి విరామమాత్రం, తస్మాత్, తదభసంధి విరామమాత్రాత్. మాత్రాత్, మాత్రాభ్యాం, మాత్రేభ్యః తదభసంధి విరామ మాత్ర శబ్దః అకారాంత నపుంసకలింగః పంచమ్యేకవచనాంతః. యత్+బ్రహ్మ, యద్బ్రహ్మ జశ్త్వసంధి. నియుత+అనుభవే, నియుతానుభవే, సవర్ణదీర్ఘ సంధి. అనుభవే+అపి, అనుభవేఽపి. "ఏఙః పదాన్తాదతి" (6.1-105) అను సూత్రముచే పూర్వరూప సంధి. అపి+అన్యాం. అప్యన్యాం యణాదేశ సంధి, క్షణ+అర్ధే, క్షణార్ధే, సవర్ణదీర్ఘ సంధిః క్షామ్యసి+అహో క్షామ్యస్యహో యణాదేశసంధి. తత్+అభసంధి. తదభసంధి. జశ్త్వసంధి.

ఛందోఽలంకారములు. వసంత తిలకా వృత్తము. త-భ-జ-జ-గగ లుండవలయును. ఉదాత్తాలంకారము. ఉదాత్త మృద్ధి చరితం. శ్లాఘ్యం చాన్యోపలక్షణమ్. బ్రహ్మకల్పానియుత కాలమును భరించిననూ నశింపని పాపమును అర్ధక్షణమున చేసిన వాడు ఇక పాపము చేయునని సంకల్పంబు విరమించినమాత్రమున భగవంతుడు క్షమించుట వృద్ధి చరితము గనుక ఉదాత్తాలంకారము.

భావము. ఇందు క్షమాగుణాధిక్యమును అనుగ్రహించుచున్నారు. ఎవరైనను వాడు వాడు చేసిన పాపమును అనుభవించి తీరవలయును గదా! "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి" అనుటవలన చేసిన పాపమును అనుభవింపక తప్పదు గదా! ఒకడు అర్ధక్షణములో చేసిన పాపము, ఎంతకాలముగా అనుభ [illegible]

శబ్దరూప సమాసములు. (క్షాంతిః) క్షాంతిః క్షాంతీ క్షాంతయః క్షాంతి శబ్దః ఇకారాంత స్త్రీ
లింగః ప్రథమైకవచనాంతః "క్షాంతి ప్రతిక్షా" ఇత్యమరః (తవ) తవ, తే, యువయోః, వాం,
యుష్మాకం, వః, యుష్మచ్ఛబ్దః దకారాంత పుంలింగః షష్ఠ్యేకవచనాంతః (ఇయం)
ఇయం, ఇమే, ఇమాః ఇదం శబ్దః మకారాంత స్త్రీలింగః ప్రథమైకవచనాంతః (ఇయతీ)
ఇయతీ, ఇయత్యౌ, ఇయత్యః, ఇయతీ శబ్దః ఈకారాంత స్త్రీలింగః ప్రథమైకవచనాంతః
(మహతీ) మహతీ, మహత్యౌ, మహత్యః. మహతీశబ్దః ఈకారాంత స్త్రీలింగః ప్రథమైకవ
చనాంతః (కథం, న) అవ్యయములు. (ముహూర్తాత్) ముహూర్తాత్, ముహూర్తాభ్యాం, ముహూర్తేభ్యః, ము
హూర్తైః ఇత్యనేనద్యాతో పరస్మైపద విధి లట్. ప్రథమపురుషైకవచనమ్. (అహో)
అవ్యయము. (త్వయి) త్వయి, యువయోః, యుష్మాసు. యుష్మచ్ఛబ్దః దకారాంతః పుంలింగః
సప్తమ్యేకవచనాంతః. (కృతాంజలి పంజరేషు) అంజలిః ఏవ పంజరః అంజలి పంజరః,
అవధారణాపూర్వపద కర్మధారయము. కృతః అంజలి పంజరః యైస్తే కృతాంజలి పంజ
రాః, తేషు, కృతాంజలి పంజరేషు, బహువ్రీహి. పంజరః పంజరౌ పంజరయోః పం
జరేషు, కృతాంజలి పంజర శబ్దః అకారాంతః పుంలింగః సప్తమీ బహువచనాంతః
(ఇత్థమ్) థముప్రత్యయాంత అవ్యయము. (స్ఫుటః) తసిలంతావ్యయము. (నిఖిల జంతుషు) నిఖిలాశ్చ తే జంతవశ్చ
నిఖిల జంతవః తేషు, నిఖిల జంతుషు, విశేషణ పూర్వపద కర్మధారయము. (నిర్విశేషం)
నిర్గతః విశేషః యస్మాత్ నిర్విశేషమ్. ప్రాదిబహువ్రీహి. నిర్విశేషం, నిర్విశేషే, నిర్విశేషాణి.
నిర్విశేష శబ్దః అకారాంత నపుంసకలింగః ప్రథమైకవచనాంతః. (వాత్సల్య
తః) వత్సం ... వత్సలా, వత్సలాయాః భావః వాత్సల్యమ్. వాత్సల్యం, వాత్సల్యే, వా
త్సల్యాని, వాత్సల్యశబ్దః అకారాంత నపుంసకలింగః ప్రథమైకవచనాంతః. (ఉత్సు
క జనేషు) ఉత్సుకాశ్చ తే జనాశ్చ ఉత్సుక జనాః, తేషు, ఉత్సుక జనేషు. విశేషణ పూర్వ
పద కర్మధారయము. జనః జనయోః, జనేషు, ఉత్సుకజనశబ్దః అకారాంతః పుంలింగః
సప్తమీ బహువచనాంతః (కథమ్) థముప్రత్యయాంతావ్యయము. (గుణః) గుణః, గుణౌ, గు
ణాః, గుణ శబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (తే) తవ, తే, యువయోః,
వాం, యుష్మాకం, వః, యుష్మచ్ఛబ్దః దకారాంతః పుంలింగః షష్ఠ్యేకవచనాంతః. తవ+ఇయం,
తవేయమ్, గుణసంధి. ముహూర్తాత్+అహో, ముహూర్తాదహో జశ్త్వసంధి. కృత + అంజలి, కృతాం
జలి. సవర్ణదీర్ఘ సంధి. స్ఫుటః+నిఖిల, స్ఫుటో నిఖిల, ఉత్వము. ఓత్వము, గుణసంధి.

ఛందోఽలంకారములు. వసంతతిలకావృత్తము. త-భ-జ-జ-గగలుండవలయును.
ఉదాత్తాలంకారము "ఉదాత్తం వృద్ధిమచ్చరితం శ్లాఘ్యం చాన్యోపలక్షణమ్" క్షమాగుణ
మువలనే వాత్సల్యగుణము కూడ, అంజలి, యను కవచము ధరించనవారియందు
ప్రసరించుట విశేషము! పక్షపాతము లేని వాత్సల్యము, సకల జీవులపైనను
ప్రసరించుట సహజమే గదా. యనునది వృద్ధిచరితము.

భావము. క్షమాగుణ ప్రస్తావమందు దీని కొత్త భూమి యైన వాత్సల్యగుణమును గూర్చి
ప్రస్తావించుచున్నారు. క్రింది శ్లోకమున 'క్షమస్వ హో తదభి సంధి విరామ మాత్రాత్'
అనబడిన అధికారము ను పొందిన యూక్షాంతిగుణము, అపరాధములను నిండుగా చేసి

యున్నవారు, ఒక ప్రాయశ్చిత్తమును కూడ చేసికొనక యొక అంజలిని మాత్రమును చే యకుండ, ఆ యపరాధముల నుండి విరమించిన మాత్రమున నే క్షమను చూపిన దేవర వారు, 'కృతాపరాధస్య హి తే నాऽన్యత్ పశ్యామ్యహం క్షమమ్, అన్యత్రాంజలిం బద్ధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్' ఇత్యాది ప్రమాణములున్ను చూచియో, వానిని తెలియకయో, అంజలిని ఘటించిన భక్తుల విషయమున ఆ క్షమను చూపకయుండుట సాధ్యమగునా?

పంజరము అనగా కవచము. అంజలి యను నది, తన దోషమును పోగొట్టుకొనుటకు తొడుగుకొనుటవలన కవచము అనదగును గదా! "కథం ముక్త్వేత్" అనగా, 'కథం విరమేత్' అనుట. భక్తి లేని వారియందును ప్రసరింపగల దేవరవారి క్షమ, భక్తియుక్తులయందు ప్రసరించువనుటను తెలుపగ అవసరమలయునా? ఇది యొక అతిశయమా? అని భావము. అనవలసిన వాత్సల్యము కూడ, అని యుత్తరార్థమందు చెప్పుచున్నారు. భక్తియుక్తులందు ప్రసరించుచున్న క్షమాగుణము, ఎట్లు అతిశయము కాదో, అట్లే, భక్తి గలవారి యెడ కన్పరచు దేవరవారి వాత్సల్యము కూడ అతిశయము కాదు, అనుచున్నారు. వారిలో వెల్లవారి సమానముందును కనకధారలను వర్షించు వాకటు, పుత్ర మిత్ర బాంధవుల యెడ కనకధారలను వర్షించెను, అన్నచో దానిని యొక విశేషమని చెప్పుదురా? సహజమే యనవలెను గదా! అట్లే, భక్తులు-ఇతరులు, అను వ్యత్యాసము లేక అందరి యెడను ప్రసరింపగలదైన వాత్సల్యగుణమునునది అన్యాశ్రిత భక్తుల యెడ ప్రసరించి అతిశయమును పొందజాలదు గదా! యనుట. ఇందువలన, "అనాలోచిత విశేషాశేష లోకశరణ్యత్వము" అనుసంధింపబడినది.

విశ్వం ధియైవ విరచయ్య నిచాయ్య భూయః
సంజహ్రుష ~~స్తవ~~ స్సతి సమాశ్రిత వత్సలత్వే,
ఆజగ్ముష స్తవ గజేంద్ర బృంహితేన
పాదం పరామృశతి కోపి చ కా మనీషా॥ 63.

పదవిభాగము. విశ్వం, ధియా, ఏవ, విరచయ్య, నిచాయ్య, భూయః, సంజహ్రుషః, సతి, సమాశ్రిత వత్సలత్వే, ఆజగ్ముషః, తవ, గజేంద్ర బృంహితేన, పాదం, పరామృశతః, అపి, చ, కా, మనీషా.

అర్థము. స్వామీ! ధియా ఏవ = సంకల్పము చేతనే, విశ్వం = ప్రపంచమును, విరచయ్య = అంతను సృజించియు, నిచాయ్య = రక్షించియు, భూయః సంజహ్రుషః = మరల సంహరించుచున్నవాడవై, సమాశ్రిత వత్సలత్వే సతి = ఆశ్రితులయందు వాత్సల్యము గలిగినపుడు, గజేంద్ర బృంహితేన = గజేంద్రాళ్వారుల ఆర్తధ్వనితో (మడుగు తీరమునకు) ఆజగ్ముషః = పరుగెత్తి వచ్చువాడైన, పాదం = ఈ మనుజుని పాదమును, పరామృశతః అపి = తడవి పరామర్శించు, తవ = దేవరవారి యొక్క, కా మనీషా = అభిప్రాయమో!

ఆకాంక్ష. కా మనీషా = అభిప్రాయమేమో! కస్య = ఎవరియొక్క, తవ = దేవరవారియొక్క, తవ కథంభూతస్య = దేవరవారెట్టివారు, పరామృశతః = తడవి పరామర్శించువారు, కం = దేనిని? పాదం = ఈ మనుజుని యొక్క పాదమును. పునః కథంభూతస్య = ఇంకను దేవరవారెట్టివారు? ఆజగ్ముషః = (మడుగు తీరమునకు) పరుగెత్తి వచ్చువారు, కేన = దేనితో? గజేంద్ర బృంహితేన = గజేంద్రాళ్వారుల ఆర్తధ్వనితో. కస్మిన్ సతి = ఏది యుండగా, సమాశ్రిత వత్సలత్వే సతి = ఆశ్రితులయందు వాత్సల్యము కలిగి

భావము. క్రింది శ్లోకమందు చెప్పబడిన వాత్సల్య గుణము యొక్క నిర్వాహభూమిని చెప్పు యీశ్లోకమందు అభివ్యక్తపరుచుచున్నారు. గజేంద్రాళ్వానులందు, చూపిన వాత్సల్యాతిశయము, వాత్సల్య గుణము యొక్క పరాకాష్ఠ కదా! ఆ విషయమునే యనుగ్రహించుచున్నారు. తిరువాయిమొழி (3-1-9) "ముధుకాదవైనువియ" అను పాశురమునకు, ఈశ్లోకము విశేషవ్యాఖ్యానము వంటిది.

గజేంద్రుడు ఒక మడుగు తీరమున మొసలినోట చిక్కి "గజ ఆకర్షతే తీరే గ్రాహ ఆకర్షతే జలే" అనునట్లు దీర్ఘకాలము పోరాడి "ఇక మనలను మనమే కాపాడుకొన జాలము" అని నిర్ణయించుకొని "మూలకారణంబెవ్వడు? అనాదిమధ్యలయుడెవ్వడనుచు మొఱలిడగా, ఆకేకను విని సిరికిం జెప్పక శంఖచక్రయుగముం జేదోయి సంధింపక, ఆకర్ణకాంతర ధమ్మిల్లము చక్కనొత్తక పరుగెత్తి వచ్చి మడుగు తీరమున నిలచి పరమపురుషుడు రక్షించిన వృత్తాంతము గదా యిది. దీనిని మన యాళ్వారులు అనేకములైన పాశురములతో అనుగ్రహించి యున్నారు. గజేంద్రుని యాపదను తొలగింపదలచినచో ఇంత సంభ్రమముతో ఉరుకులు పరుగులతో వచ్చిపడవలయునా? ఇట్లు వచ్చియు "గ్రాహం చక్రేణ మాధవః" అని సుదర్శనచక్రముతోగదా పని చేసినది. ఈ సుదర్శనాయుధమును పరమపదము నుండియే ప్రయోగించినచో ఆ సుదర్శనమూర్తియే వచ్చి మొసలిని పరిమార్చి తిరిగిరాదా! అదియుగాక సుదర్శనమూర్తిని ఆజ్ఞాపింపవలయునను నిర్బంధముకూడ లేదుకదా, సకలప్రపంచముల సృష్టి-స్థితి-లయములను "సోఽకామయత" "నతదైక్షత" అని యుపనిషత్తు వచించిన విధముగా తన సంకల్పశక్తి వలననే నిర్వహించు సర్వేశ్వరుడు, ఆ సంకల్పముచేతనే మొసలిని తుంచివైచి, గజేంద్రుని యాపదను తొలగింపగలిగియుండగా, ఆవిధముగా చేయక, నేరుగా పరుగెత్తి ~~[illegible]~~ వచ్చెనే! పరుగెత్తి వచ్చి మొసలిని పరిమార్చి నెత్తురుకారుచుండ నిలచిన గజేంద్రుని పాదమును తన చేతితో తడవిచూచి ఉపచారోక్తులను చెప్పుచు ఆదరముల చేయుటయు ఎంత ఆశ్చర్యము! ఇట్లు చేయుటలో నీ యుద్దేశమేమియో పరతా! అనుచున్నారు

ఈవిధమైన ప్రశ్నతోనే యీశ్లోకము ముగించినది. క్రింద ఉదాహరింపబడిన తిరువాయిమొழி పాశురపు పిదపటి పాదములందు దీనికి సమాధానమును చూడవచ్చును. "పరమాపదం ఆపన్నో మనసా అచింతయత్ హరిమ్" అన్నట్లు, ఆపదయందు చిక్కిన గజేంద్రుడు, సర్వేశ్వరుని మనస్సుతో చింతించెనేగాని "యిక్కడరమ్ము!" అని పిలువలేదు. ఇట్లుండగా, తిరుమళిశై యాళ్వార్, "పోరానై పొయ్కైవాయ్ కోట్పట్టు నిన్నలఱి, నీరార్ మలర్క్కమలం కొణ్డోర్ నెడుంకైయాల్, నారాయణా! ఓ మణివణ్ణా! నాగణైయాయ్, వారాయ్ ఎన్నారిడరై నీక్కాయ్" (శిరియ తిరుమడల్) అని సర్వేశ్వరుని మడుగు తీరమునకు రమ్మని యతను పిలచినట్లే పాశురమును పాడినారు. యథార్థముగా, సర్వేశ్వరుడు నేరుగా వచ్చియే పరిహరింపవలసిన ఆపద కావునను, ఇట్లు నేరుగా వచ్చితీరవలయునను అభిప్రాయము దృఢముగా గజేంద్రాళ్వా

క్షణముల ఆపద సంకల్పముచేత తీర్చజాలనిదా? నేరుగావచ్చి తెంచవేసి పరిహరిం పదగినదా? అన్నచో? అవును, మొసలిని పరిమార్చి నపిదప గజేంద్రాళ్వార్ విన్నవిం చుచున్నాడుగదా! - " నాఽహం కళేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన! కరస్థకమలా న్యేవ పాదయో రర్పితుం తవ" అనుచున్నాడు. ఏనాటకైనను ఒకనాడు నశించుచు పోవలసిన యీదేహము. పోవుటను గూర్చి నేను బాధపడలేదు, నిన్ను నేరుగా కన్నులార గాంచి కష్టపడి కోసిన యీ పుష్పములను శ్రీపాదములందు సమర్పింపవలయును అని యే నేను విచారించుచుంటిని స్వామీ! అనిగదా గజేంద్రాళ్వార్ విన్నవించినది! చివికి సుదర్శనమును పంపి తుమిచివేయవలయును? సంకల్పశక్తితోనే యుమిచేయవల యును? నేరుగా వచ్చి సాక్షాత్కరింపవలసినదేగదా! వచ్చి యేనుగు పడిన ఆపదయొక్క విఘనతను చూడగనే, అయ్యో! నా రక్షణభారమే పైనదీ! నా భక్తుని యిట్లు మొసలిచే బడ వేదబెట్టితినే; ఎంత ఘోరము! ఎంత ఘోరము! అని దిగులుచెంది, తన తిరుప్పరివట్టమును (వస్త్రమును) తన నోటితో దట్టముంచుకొని తేదివేసి రొంత్తిరొంత్త యం పచారములను చేసిన గాని తన మనోవ్యథ తీరనందువలన అది యును చేయవలసినదాయెను.

'కామనీషా' అను ప్రశ్నయుట లో ఉద్దేశించబడినది. అందరి ఆర్తవస్థయందును బడ్లె ప్రకాశింప బడినది.

యః కశ్చిదేవ యది కించన హంత జంతుః
  భక్త్యా భజేత భగవంత మనన్యచేతాః ।
తం సోఽయ మీదృశ ఇయానితి వాఽప్యజానన్
  హా వైనతేయ సమ మప్యురరీకరోషి ॥ 64.

పదవిభాగము. యః, కశ్చిత్, ఏవ, యది, కించన, హంత, జంతుః, భక్త్యా, భజేత, భగవంతం, అనన్యచేతాః, తం, సః, అయం, ఈదృశః, ఇయాన్, ఇతి, వా, అపి, అజానన్, హా, వైనతేయసమం, అపి, ఉరరీకరోషి.

అర్థము. స్వామీ! యః = ఏ, కశ్చిత్ ఏవ జంతుః = ఒక చేతనుడో, భక్త్యా = భక్తితో, అనన్యచేతాః = అనన్యమనస్సు గలవాడై, భగవంతం = భగవంతుడవైన దేవరవారిని, కించన భజేత యది = కొంచెము భజించినయెడల, సః అయం = ఆ యితడు, ఈదృశః = ఇట్టివాడు, ఇయాన్ = ఇంతవాడు, ఇతి వా అపి = అని యును గూడ, అజానన్ = తెలియం పనివాడవై, తం = అతనిని, వైనతేయసమం అపి = పెరియతిరువడి (గరుత్మంతునితో) సమానునిగాను, ఉరరీకరోషి = భావించుచుంటిరి. హా, హంత! ఇది మిక్కిలి యాశ్చర్యపద దగినది.

అన్వయం. హా హంత! ఇది మిక్కిలి యాశ్చర్యపడదగినది. కిం ఏది. ఉరరీకరోషి = భావించుచుం టిరి. కః = ఎవరు, (త్వం = దేవరవారు) కం = ఎవనిని? తం = అతనిని, కం అపి = ఎవనినిగా, వైన తేయసమం అపి = గరుత్మంతునితో సమానునిగాను. త్వం, అను ప్రథమాంత కర్తృపదము, తం, అను ద్వితీయాంత కర్మపదమును ఉరరీకరోషి, యను క్రియాపదము ఉన్నవి గనుక సకర్మ కకర్తరి ప్రయోగము. త్వం కథంభూతస్సన్ = దేవరవారు ఎట్టివారై? అజానన్ = తెలియం పనివారై, కిమితి = ఏమని? ఈదృశః, ఇయాన్ ఇతి వా అపి = ఇట్టివాడు, ఇంతవాడు అని యును గూడ. కః = ఎవడు? సః అయం = ఆ యితడు. కిం కుర్యాత్ యది? = ఏమి చేసినయెడల? కించన భజేత యది = కొంచెము భజించినయెడల. కం = ఎవరిని, భగవంతం = భగ వంతులరైన దేవరవారిని, కథంభూతః = ఎట్టివాడై, అనన్యచేతాః = అనన్యమైన మనస్సుగలవాడై

పునః కథంభూతః = ఇంతను ఎట్టివాడు భవ్యః = పవిత్రుడై, కః = ఎవడు, యః కశ్చిత్ ఏవ జంతుః = ఏ యొకడైన చేతనుడు,

శబ్దరూప సమాసములు. (యః) యః, యౌ, యే. యచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ప్రథమైక వచనాంతః (కశ్చిత్) కః, కౌ, కే, కింశబ్దః మకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. చిత్, అవ్యయము "అనాకర్త్యే తు చిచ్చనౌ" ఇత్యమరః (ఏవ, యది) అవ్యయములు (కించన) కిం, కే, కాని. కింశబ్దః మకారాంత నపుంసకలింగః ప్రథమైకవచనాంతః 'చన' అవ్యయము, (కొంత) అవ్యయము. (జంతుః) జంతుః, జంతూ, జంతవః, జంతుశబ్దః ఉకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః (భవ్యః) భవ్యః, భవ్యౌ, భవ్యాః, భవ్యశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (భజేత) భజేత, భజేయాతాం, భజేరన్. భజ-సేవాయామిత్యస్మాద్ధాతోః ఆత్మనేపది విధిలిఙి ప్రథమపురుషైకవచనాంతః. (భగవంతం) భగవంతం, భగవంతౌ, భగవతః. భగవచ్ఛబ్దః తకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః (అనన్యచేతాః) అనన్యం చేతః యస్య సః అనన్యచేతాః, షష్ఠీ బహువ్రీహిః. అనన్యచేతాః అనన్యచేతసౌ, అనన్యచేతసః, అనన్యచేతశ్శబ్దః సకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః, (తం) తం, తౌ, తాన్, తచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (సః) సః, తౌ, తే, తచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (అయం) అయం, ఇమౌ, ఇమే, ఇదం శబ్దః మకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః (ఈదృశః) ఈదృశః, ఈదృశౌ, ఈదృశాః, ఈదృశశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః, (ఇయాన్) ఇయాన్, ఇయన్తౌ, ఇయన్తః, ఇయచ్ఛబ్దః తకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (అనన్యచేతాః) అన్యస్మిన్ న విద్యతే చేతః యస్య సః, అనన్యచేతాః, అనియమ విగ్రహము (ఇతి, వా అపి) అవ్యయములు. (అజానన్) అజానన్, అజానన్తౌ, అజానన్తః, అజానచ్ఛబ్దః తకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (వై) అవ్యయము. (వైనతేయసమమ్) వినతాయాః అపత్యం పుమాన్, వైనతేయః, వైనతేయేన సమః, వైనతేయసమః, తం, వైనతేయసమమ్, తృతీయా తత్పురుషము. సమం, సమౌ, సమాన్ వైనతేయసమశబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (అపి) అవ్యయము (ఉరరీకరోతు) ఉరరీకరోతు, ఉరరీకురుతాం, ఉరరీకుర్వన్తు. ఉరరీత్యవ్యయపూర్వక డుకృఞ్-కరణే. ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది లట మధ్యమ పురుషైకవచనాంతః. "ఊరర్యురరీ చోరరీ చ విస్తారేఽఙ్గీకృతే త్రయమ్" ఇత్యమరః. కః+చిత్, కశ్చిత్, శ్చుత్వసంధి. కశ్చిత్+ఏవ, కశ్చిదేవ, జశ్త్వసంధి. భవ్యః+భజేత, భవ్యో భజేత, రుత్వము, ఉత్వము, గుణసంధి, సః+అయం, సోఽయమ్, రుత్వము ఉత్వము. గుణసంధి. పూర్వరూపసంధి. ఈదృశః+ఇయాన్, ఈదృశ ఇయాన్, విసర్గలోపసంధి. వా+అపి, వాఽపి, సవర్ణదీర్ఘసంధి. అపి+అజానన్, అప్యజానన్, యణాదేశసంధి. అపి+ఉరరీకరోతు, అప్యురరీకరోతు, యణాదేశసంధి.

ఛందోఽలంకారములు: వసంతతిలకావృత్తము. త-భ-జ-జ-గగలుండ వలయును.

ప్రహర్షణాలంకారము "వాంఛితాదధికార్థస్య సంసిద్ధిశ్చ ప్రహర్షణమ్" సామాన్యుడైనను నెవడైనను అనన్యమనస్కుడై భజించిన యెడల అతడిట్టివాడు అని భావింపక సర్వేశ్వరుడు, అతనిని వైనతేయునితో సమునిగా అంగీకరించుట, వాంఛితము కంటెను అధికార్థము సంసిద్ధించినట్లే కదా! అందువలన ప్రహర్షణాలంకారము అనబడినది.

భావము. క్రిందిశ్లోకమున గజేంద్రుని యందు సర్వేశ్వరుడు చూపిన వాత్సల్యాతిశయమును అనుగ్రహించిన ప్రసంగముండు. సర్వేశ్వరుడు భక్తులను 'ఇట్టివారు వీరు' అని చూడక మోహాతిశయముతో గ్రహించునని యుందు అనుగ్రహించుచున్నారు. తిర్యగ్జాతియుడైన గజేంద్రుని యందా యింత వ్యామోహము! అని కొందరు తలంతురు. ఇంకను హీనజాతి యందు పుట్టినను, వస్తుకోటి యందు లెక్కింపదగనివాన్నైనను, "అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః" అని గీతయందు చెప్పిన విధముగనే అనన్యమనస్కుడైనట్టిదే సర్వేశ్వరుడు గమనించునట్టిది. ఇతడెట్టివాడు, ఎంతవాడు అనియు భగవంతుడు లెక్కచేయడు. "ఇతడు చేసిన దోషమేమి? ఇతని పుణ్యమేమి? ఇతని యభ్యాసమేమి?" అని యేమియు గణింపడు. "దాసస్సఖా వాహనమాసనం ధ్వజో యస్తే వితానం వ్యజనం త్రయీమయః" అనబడిన పెరియతిరువడితో (గరుత్మంతునితో) సమానుడుగాను ఇతనిని గ్రహించుటను చూచుచున్నాము. ఇదేమి శీలమో కదా! యని విస్మయించుచున్నారు.

ఈ శ్లోకమున 'ఉరరీకరోషి' యని మధ్యమపురుషక్రియ యుండుట వలన రెండవ పాదమున "భగవంతం" యని యున్న ప్రథమపురుషనిర్దేశము కుదురదని భావించి కొందరు "భక్తా భజేత హి భవన్తమ్" అని 'భగవంతం' అనుపదమును మార్చి చదువుదురు. అది అవసరము లేదు. 'భగవంతం' అనగా 'దేవరవారిని' అని యర్థము. 'పూజ్యం భవన్తమ్' అని భావము.

త్వత్సామ్యమేవ భజతామభివాంఛసి త్వం
తత్సాత్కృతైర్విభవరూపగుణైస్త్వదీయైః ।
ముక్తిం తతో హి పరమం తవ సామ్యమాహుః
త్వద్దాస్యమేవ విదుషాం పరమం మతం తత్ ॥ 65.

పదవిభాగము. త్వత్సామ్యం, ఏవ, భజతాం, అభివాంఛసి, త్వం, తత్సాత్కృతైః, విభవరూపగుణైః, త్వదీయైః, ముక్తిం, తతః, హి, పరమం, తవ, సామ్యం, ఆహుః, త్వద్దాస్యం, ఏవ, విదుషాం, పరమం, మతం, తత్.

అర్థము. స్వామీ! భజతాం = భక్తులకు, తత్సాత్కృతైః = వారికి అధీనము చేయబడిన, త్వదీయైః = నీ సంబంధములైన, విభవరూపగుణైః = విభవములు, రూపగుణములచేతను (ముక్తిదశయందు) త్వత్సామ్యం ఏవ = నీతో సమానముగా నుండుటనే, త్వం = దేవరవారు, అభివాంఛసి = కోరుచుంటిరి. తతః = ఆకారణము వలననే, తవ = దేవరవారియొక్క, పరమం సామ్యం = పరమమైన సామ్యమును, ముక్తిం = ముక్తినిగా, ఆహుః హి = చెప్పుచున్నారుగదా. త్వద్దాస్యం ఏవ = దేవరవారికి కైంకర్యము చేయుటయే, తత్ = మోక్షము అని, విదుషాం = శ్రీవైష్ణవ విద్వాంసుల యొక్క, పరమం మతం = శ్రేష్ఠమైనట్టి సిద్ధాంతము.

ఆకాంక్ష. పరమం మతం = శ్రేష్ఠమైనట్టి సిద్ధాంతము. కిం = ఏది? త్వద్దాస్యం ఏవ = దేవరవారికి కైంకర్యము చేయుటయే. కిమితి = ఏమని? తత్ = ఆ మోక్షము అని. కేషాం = ఎవరియొక్క? విదుషాం = శ్రీవైష్ణవ విద్వాంసుల యొక్క. ఆహుః హి = చెప్పుచున్నారు

గదా! తే = ఎవరు (వేదవేత్తలు వేదవిదః) కిం = దేనిని, పరమం సామ్యం = పరమమైన సమానత్వమును, కస్య = ఎవరి యొక్క: తవ = దేవర వారి యొక్క, కిం = దేనిని గా, ముక్తిం = మోక్షమును గా, వేదవిదః అను కర్తృపదము, పరమం సామ్యం, ముక్తిం అను ద్వితీయాంత కర్మపదము, ఆహుః అను క్రియాపదము ఉన్నవి గనుక సకర్మక కర్తరి ప్రయోగము. కుతః = ఎందువలన? తతః = ఆ కారణము వలననే, అభివాంఛసి = కోరుచుంటివి కః = ఎవరు, త్వం = దేవరవారు, కిం పదం = దేనినే, త్వత్సామ్యం ఏవ = నీతో సమానముగా నుండుటనే, త్వం అను ప్రథమాంత కర్తృ పదము, త్వత్సామ్యం, అను ద్వితీయాంత కర్మపదము, అభివాంఛసి, అను క్రియాపదము, ఉన్నవి గనుక, సకర్మక కర్తరి ప్రయోగము. కేషాం = ఎవరికి భజతాం = భక్తులకు, కైః = వేనిచేత? విభవరూపగుణైః = విభవములు రూపగుణముల చేతను, విభవరూప గుణైః కథంభూతైః = విభవరూపగుణములు ఎట్టివి? త్వదీయైః = నీ సంబంధములైనవి.

శబ్దరూప సమాసములు, (త్వత్సామ్యం) సమస్యభావః సామ్యం, త్వయా సామ్యం త్వత్సామ్యమ్. తృతీయా తత్పురుషము. త్వత్సామ్యం, త్వత్సామ్యే, త్వత్సామ్యాని, త్వత్సామ్య శబ్దః అకారాంత నపుంసకలింగః ద్వితీయైకవచనాంతః. (ఏవ) అవ్యయము. (భజతామ్) భజతః, భజతోః, భజతామ్. భజత్ శబ్దః తకారాంతః పుంలింగః షష్ఠీ బహువచనాంతః. (అభివాంఛసి) అభివాంఛసి, అభివాంఛథః, అభివాంఛథ, అభి ఇత్యుపసర్గపూర్వక వాఛి - ఇచ్ఛాయామ్, ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది లట్ మధ్యమ పురుషైకవచనాంతః. (త్వం) త్వం, యువాం, యూయమ్. యుష్మచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః (తత్త్వవ్రాతైః) తేషాం వ్రాతాః తత్త్వవ్రాతాః తైః, తత్త్వవ్రాతైః షష్ఠీ తత్పురుషము. తత్త్వవ్రాతేన, తత్త్వవ్రాతాభ్యాం, తత్త్వవ్రాతైః, తత్త్వవ్రాతశబ్దః అకారాంతః పుంలింగః తృతీయా బహువచనాంతః. (విభవరూపగుణైః) విభవాశ్చ రూపంచ గుణాశ్చ, విభవరూపగుణాః, తైః విభవరూపగుణైః, గుణేన, గుణాభ్యాం, గుణైః. విభవరూపగుణ శబ్దః అకారాంతః పుంలింగః తృతీయా బహువచనాంతః. (త్వదీయైః) తవ ఇమే త్వదీయాః, తైః, త్వదీయైః. త్వదీయేన, త్వదీయాభ్యాం, త్వదీయైః. త్వదీయ శబ్దః అకారాంతః పుంలింగః తృతీయా బహువచనాంతః. (ముక్తిమ్) ముక్తిం, ముక్తీ, ముక్తీః. ముక్తి శబ్దః ఇకారాంత స్త్రీలింగః ద్వితీయైకవచనాంతః. "ముక్తిర్మోక్షోపవర్గః" ఇత్యమరః. (తతః) తసిలంతావ్యయము. (హి) అవ్యయము. (పరమమ్) పరమం, పరమే, పరమాణి. పరమశబ్దః అకారాంత నపుంసకలింగః ద్వితీయైకవచనాంతః. (తవ) తవ, తే, యువయోః, వాం, యుష్మాకం, వః. యుష్మచ్ఛబ్దః దకారాంతః పుంలింగః షష్ఠ్యేకవచనాంతః. (సామ్యమ్) సమస్యభావః సామ్యమితి. సామ్యం, సామ్యే, సామ్యాని. సామ్యశబ్దః అకారాంత నపుంసకలింగః ద్వితీయైకవచనాంతః. (ఆహుః) బ్రూతే, ఆహ, బ్రూతః, ఆహతుః, బ్రువన్తి, ఆహుః, బ్రూఞ్ - వ్యక్తాయాం వాచి ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది లట్ ప్రథమపురుష బహువచనరూపము. (త్వద్దాస్యమ్) తవ దాస్యం,

మొదవైన వారిని భావించి చెప్పబడినది.

> తద్వై తథాఽస్తు, కతమోఽయ మహో! స్వభావో
> యావాన్ యథావిధ గుణో భజతే భవన్తమ్।
> తావాం స్తథావిధగుణ స్తదధీనవృత్తి
> స్సంశ్లిష్యసి త్వమిహ తేన సమానధర్మా ॥ ౬౬.

ప్రదవిభాగము. తత్, వై, తథా, అస్తు, కతమః, అయం, అహో, స్వభావః, యావాన్, యథావిధ గుణః, భజతే, భవన్తమ్, తావాన్, తథావిధగుణః, తదధీనవృత్తిః, సంశ్లిష్యసి, త్వం, ఇహ, తేన, సమానధర్మా.

అర్థము. స్వామీ! తత్ = క్రిందిశ్లోకమున చెప్పబడిన విషయము, తథా అస్తు = అట్లు లుండనీ. (ఈ యాశ్చర్యమును వినుడు) అయం = ఈ స్వభావః = స్వభావము, కతమః = ఏమి? అహో = ఆశ్చర్యము. యావాన్ = (ఒకసేవకుడు) ఎంతటివాడై, యథావిధగుణః = ఏవిధమైన గుణములను ఉపాస్యముగా గలవాడై, భవన్తం = దేవరవారిని, భజతే = సేవించుచున్నాడో? త్వం = దేవరవారు, తావాన్ = అంతటివారై, తథావిధగుణః = అట్టి గుణములు గలవారై, తదధీనవృత్తిః = ఆ యుపాసకునికి అధీనమైన వృత్తిని గలవారై, తేన = వానితో సమానధర్మా = సమానమైన ధర్మములుగలవారై, ఇహ = ఇచ్చట, సంశ్లిష్యసి = కలిసియుందురు!

ఆకాంక్ష. సంశ్లిష్యసి = కలసియుందురు. కః = ఎవరు? త్వం = దేవరవారు, కేన = ఎవనితో? తేన = వానితో. కుత్ర = ఎచ్చట. ఇహ = ఇచ్చట. కథంభూతః = ఎట్టివారై, సమానధర్మా = సమానమైన ధర్మములను గలవారలై. పునః కథంభూతః = ఇంకను ఎట్టివారై, తదధీనవృత్తిః = ఆయుపాసకుని అధీనమైన వృత్తిని గలవారై, పునః కథంభూతః = ఇంకను ఎట్టివారై, తథావిధగుణః = అట్టి గుణములు గలవారై. పునః కథంభూతః = ఇంకను ఎట్టివారై, తావాన్ = అంతటివారలై, త్వం, అను ప్రథమాంత కర్తృపదము, సంశ్లిష్యసి, అను క్రియాపదము, యిది గమక అకర్మక కర్తరి ప్రయోగము. భజతే = సేవించుచున్నాడో? కః = ఎవడు? యావాన్ = ఒకసేవకుడు ఎంతటివాడై, కం = ఎవరిని? భవన్తం = దేవరవారిని, కథంభూతః = ఎట్టివాడై, యథావిధగుణః = ఏవిధమైన గుణమును ఉపాస్యముగా గలవాడై, యావాన్, అను ప్రథమాంత కర్తృపదము, భవన్తం, అను ద్వితీయాంత కర్మపదము భజతే, అను క్రియాపదము ఉన్నవిగనుక సకర్మక కర్తరి ప్రయోగము. అహో = ఆశ్చర్యము. కః = ఏది? అయం స్వభావః = ఈ స్వభావము. కతమః = ఏమి? తథా అస్తు = అట్లుండనీ, కిం = ఏది? తత్ = క్రిందిశ్లోకమున చెప్పబడిన విషయము.

శబ్దరూప సమాసములు. (తత్) తత్, తే, తాని. తచ్ఛబ్దః దకారాంత నపుంసకలింగః ప్రథమైకవచనాంతః (వై) అవ్యయము 'స్మ రేవం తు పునర్వైవే త్యవధారణ వాచకాః' ఇతి అమరః. (తథా) థాల్ ప్రత్యయాన్తో వ్యయము. (అస్తు) అస్తు, స్తాత్, స్తామ్, సన్తు, అసభువి, ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది లోట్ ప్రథమపురుషైకవచనాంతః, (కతమః) కతమః, కతమౌ, కతమే, కతమ శబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః (అయం)

అయం, ఇమౌ, ఇమే ఇదం శబ్దః మకారాంతః పుంలింగః ప్రథమైక వచనాంతః. (ఏవ) అవ్యయము, (స్వభావః) స్వభావః, స్వభావౌ, స్వభావాః, స్వభావ శబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైక వచనాంతః. (యావాన్) యావాన్, యావన్తౌ, యావన్తః, యావచ్ఛబ్దః తకారాంతః పుంలింగః ప్రథమైక వచనాంతః. (యథావిధ గుణః) యథావిధః గుణః యస్యసః, యథావిధగుణః. ~~–~~ షష్ఠీబహువ్రీహిః. (భజతే) భజతే, భజేతే, భజన్తే, భజ-సేవాయామ్. ఇత్యస్మాద్ధాతోః ఆత్మనేపది లట్ ప్రథమ పురుషైక వచనమ్ (భవన్తమ్) భవన్తం, భవన్తౌ, భవతః, భవచ్ఛబ్దః తకారాంతః పుంలింగః ద్వితీయైక వచనాంతః. (తావాన్) తావాన్, తావన్తౌ, తావన్తః, తావచ్ఛబ్దః తకారాంతః పుంలింగః ప్రథమైక వచనాంతః. (తథావిధ గుణః) తథావిధః గుణః యస్యసః తథావిధ గుణః. షష్ఠీ బహువ్రీహిః. తథావిధగుణః, తథావిధగుణౌ, తథావిధగుణాః. తథావిధగుణ శబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైక వచనాంతః. (తదధీనవృత్తిః) తేషాం అధీనా, తదధీనా, షష్ఠీ తత్పురుషము. తదధీనా వృత్తిః యస్యసః, తదధీన వృత్తిః. షష్ఠీ బహువ్రీహిః. తదధీన వృత్తిః, తదధీన వృత్తీ, తదధీన వృత్తయః. తదధీన వృత్తి శబ్దః ఇకారాంతః పుంలింగః. ప్రథమైక వచనాంతః. (సంశ్లిష్యసి) సంశ్లిష్యసి, సంశ్లిష్యథః, సంశ్లిష్యథ. సం, ఇత్యుపసర్గపూర్వక, శ్లిష- ఆలింగనే, ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది లట్. మధ్యమ పురుషైక వచనమ్. (త్వం) త్వం, యువాం, యూయమ్, యుష్మచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ప్రథమైక వచనాంతః. (ఇవ) సాదృశ్యావ్యయము, (తేన) తేన, తాభ్యాం, తైః, తచ్ఛబ్దః దకారాంతః పుంలింగః తృతీయైక వచనాంతః. (సమానధర్మా) సమానః ధర్మః యస్యసః సమానధర్మా. షష్ఠీ బహువ్రీహిః. సమానధర్మా, సమానధర్మాణౌ, సమానధర్మాణః. సమానధర్మన్ శబ్దః నకారాంతః పుంలింగః ప్రథమైక వచనాంతః. తత్+ఏవ, తదేవ. జశ్త్వసంధి. తథా+అస్తు, తథాऽస్తు. సవర్ణదీర్ఘ సంధి. కతమః+అయం, కతమోऽయమ్. ఉత్వము ఓత్వము. గుణసంధి. పూర్వరూపసంధి. స్వభావః+యావాన్, స్వభావో యావాన్, ఉత్వము. ఓత్వము. గుణసంధి. గుణః+భజతే, గుణో భజతే, ఉత్వము. ఓత్వము. గుణసంధి. తావాన్+తథా. తావాం+తథా తావాంస్తథా. తావాఁస్తథా. అనునాసికానుస్వార పూర్వక సకారాదేశము.

ఛందోఽలంకారములు. వసంతతిలకావృత్తము త-భ-జ-జ-గగ లుండవలయును. సమాలంకారము. "సమం స్యాత్ వర్ణనం యత్ర ద్వయోరప్యనురూపయోః" చేతనుడు ఏ విధమైన గుణములను ఏ స్వభావము గలవాడై సేవించునో భగవంతుడును అట్టి గుణములు గలవాడై ఆ యుపాసకునికి అధీనమైన వృత్తి గలవాడై వానితో సమానమైన ధర్మము గలవాడై కలిసి యుండుట చెప్పబడినది గాన సమాలంకారము.

భావము. "అప్రతీకాలంబనాన్---- తత్క్రతుశ్చ" అను బ్రహ్మసూత్రమునకు విషయవాక్యముగా " యథాక్రతురస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి" అను శ్రుతిని చూపి " తథోపాసీన స్తథైవ ప్రాప్నోతి" అని తాత్పర్యము ననుగ్రహింపబడినది. ఆ యర్థమే ఈ శ్లోకమందు అనుగ్రహింపబడుచున్నది. (తద్వా తథాऽస్తు) క్రింది శ్లోకమున చెప్పబడిన విషయములు అటుండనీ. అనుట. తన విభవరూప గుణ

ములను భక్తులకు అధీనము చేసి సామ్యమును ప్రసాదించునట్లు చెప్పుట. ఒక పెద్ద సుగుణమా? ఇప్పుడు చెప్పబడునది గదా మిక్కిలి గొప్ప సుగుణము! అని భావము. దానిని చెప్పుటకు ముందే (కతమోఽయం మహాస్వభావః) అని మనస్సున ఆశ్చర్య పడుచున్నారు. భజించువాడు ఎంత జ్ఞానాది సుగుణయుక్తుడై దేవరవారి తిరుకల్యాణ గుణములలో తన రుచికి తగిన ఏ సుగుణములను ఉపాస్యముగా గ్రహించి భజించునో? దేవరవారును అంతవారై, అతడుపాసించిన సుగుణములను మాత్రమే సుగుణముగా గ్రహించినవారై, ఆ యుపాసకునికి అధీనమైన వృత్తి గలవారై అతనితో కలిసి మెలసి ప్రవర్తింతురు. అని విస్మయమందుచున్నారు.

వేదాంతుల గోష్ఠియందు తత్క్రతున్యాయము ప్రసిద్ధము. అందు చెప్పిన ఉపాసకునికిని అతనికి ఉపాస్యుడైన సర్వేశ్వరునికే తెలియగలిగిన ఈ సుగుణవిశేషమును వివరించుట మనవంటి వారికి సాధ్యమా?

నీలాంజనాద్రినిభ మున్నస మాయతాక్ష
మాజానుజైత్రభుజ మాయతకర్ణపాశమ్।
శ్రీవత్సలక్షణ ముదారగభీరనాభిం
పశ్యేమ దేవ! శరదశ్శత మీదృశం త్వామ్॥ 67.

పదవిభాగము: నీలాంజనాద్రినిభం, ఉన్నసం, ఆయతాక్షం, ఆజానుజైత్రభుజం, ఆయతకర్ణపాశం, శ్రీవత్సలక్షణం, ఉదారగభీరనాభిం, పశ్యేమ, దేవ, శరదశ్శతం, ఈదృశం, త్వామ్.

అర్థము: హేదేవ = ఓ దేవా! నీలాంజనాద్రి నిభం = నీల = నల్లని అంజన అద్రి = కాటుక కొండతో, నిభం = సమానులును, ఉన్నసం = ఎత్తైన ముక్కు గలవారును, ఆయతాక్షం, ఆయత = విశాలములైన, అక్షం = నేత్రములను గలవారును, ఆజానుజైత్రభుజం, ఆజాను = మోకాళ్లవరకును వ్రేలాడు, జైత్ర = జయశీలములైన, భుజం = భుజములను గలవారును, ఆయతకర్ణపాశం = పొడవైన పాశములవంటి చెవులను గలవారును, శ్రీవత్స లక్షణం = శ్రీవత్సము అను మచ్చ గలవారును, ఉదారగభీరనాభిం = గొప్ప లోతైన నాభిని గలవారును ఐన, ~~త్వాం = దేవరవారిని~~ ఈదృశం = ఇట్టివారైన, త్వాం = దేవరవారిని, శరదశ్శతం = నూరేండ్లు (చాలాకాలము) పశ్యేమ = చూచెదముగాక!

ఆకాంక్ష. పశ్యేమ = చూచెదముగాక! కే = ఎవరు? వయం = దాసులమైన మేము, కం = ఎవరిని? త్వాం = దేవరవారిని. వయం, అను ప్రథమాంత కర్తృపదము, త్వాం, అను ద్వితీయాంత కర్మపదము, పశ్యేమ అను క్రియాపదము ఉన్నవి గనుక సకర్మకకర్తరిప్రయోగము. త్వాం, కథంభూతం = దేవరవారు ఎట్టివారు? ఈదృశం = ఇట్టివారు, పునః కథంభూతం = ఇంకను ఎట్టివారు? ఉదారగభీరనాభిం = గొప్ప లోతైన నాభిని గలవారు, శ్రీవత్స లక్షణం = శ్రీవత్సము అను మచ్చ గలవారు, ఆయతకర్ణపాశం = పొడవైన పాశములవంటి చెవులను గలవారు, ఆజానుజైత్రభుజం = మోకాళ్లవరకును వ్రేలాడు జయశీలములైన భుజములను గలవారు, ఆయతాక్షం = విశాలములైన నేత్రములు గలవారు, ఉన్నసం = ఎత్తైన ముక్కు గలవారు, నీలాంజనాద్రి నిభం = నల్లని కాటుకకొ

ఈ తా సమాసములు.. హేదేవ. సంబోధనము,

శబ్ద రూప సమాసములు. (నీలాంజనాద్రినిభమ్) నీలశ్చాసౌ అంజనాద్రిశ్చ నీలాంజనాద్రిః, విశేషణ పూర్వపద కర్మధారయము. నీలాంజనాద్రిణా నిభః నీలాంజనాద్రినిభః, తం, నీలాంజనాద్రినిభమ్. తృతీయా తత్పురుషము. (ఉన్నసం) ఉన్నతా నాసికా యస్య సః, ఉన్నసః తం, ఉన్నసమ్. "ఉపసర్గాచ్చ" (5-4-119) అను పాణిని సూత్రముచేత నాసికా అనుపదమునకు నసాదేశము వచ్చినది. ఉన్నసం, ఉన్నసౌ, ఉన్నసాన్, ఉన్నస శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (ఆయతాక్షమ్) ఆయతే అక్షిణీ యస్య సః ఆయతాక్షః, తం, ఆయతాక్షమ్. షష్ఠీబహువ్రీహి. ఆయతాక్షం, ఆయతాక్షౌ, ఆయతాక్షాన్, ఆయతాక్ష శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (ఆజానుజైత్రభుజమ్) ఆజానుః జైత్రాః భుజాః యస్య సః ఆజానుజైత్రభుజః తం, ఆజానుజైత్రభుజమ్. షష్ఠీబహువ్రీహి. భుజం, భుజౌ, భుజాన్, ఆజానుజైత్రభుజ శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (ఆయతకర్ణపాశమ్) ఆయతౌ కర్ణపాశౌ యస్య సః ఆయతకర్ణపాశః, తం, ఆయతకర్ణపాశమ్. షష్ఠీబహువ్రీహి. ఆయతకర్ణపాశం, ఆయతకర్ణపాశౌ, ఆయతకర్ణపాశాన్, ఆయతకర్ణపాశ శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (శ్రీవత్సలక్షణమ్) శ్రీవత్సః లక్షణం యస్య సః శ్రీవత్సలక్షణః, తం, శ్రీవత్సలక్షణమ్. శ్రీవత్సలక్షణం, శ్రీవత్సలక్షణౌ, శ్రీవత్సలక్షణాన్, శ్రీవత్సలక్షణ శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః షష్ఠీబహువ్రీహి. (ఉదారగభీరనాభిం) ఉదారా గభీరా నాభిః యస్య సః ఉదారగభీరనాభిః తం, ఉదారగభీరనాభిమ్. షష్ఠీబహువ్రీహి. గభీరనాభిం, గభీరనాభీ, గభీరనాభీన్, ఉదారగభీరనాభి శబ్దః ఇకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (పశ్యేమ) పశ్యేయం, పశ్యేవ, పశ్యేమ. దృశిర్-ప్రేక్షణే ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది విధిలింగ్ ఉత్తమపురుష బహువచనమ్. (దేవ) హే దేవ, హే దేవౌ, హే దేవాః. దేవశబ్దః అకారాంతః పుంలింగః ~~ప్రథమైకవచనాంతః~~ సంబోధన ప్రథమైకవచనాంతః. (శరదః శతమ్) శరదం, శరదౌ, శరదః, శరచ్ఛబ్దః దకారాంత స్త్రీలింగః ద్వితీయా బహువచనాంతః. శతం, శతే, శతాని, శత శబ్దః అకారాంత నపుంసకలింగః ప్రథమైకవచనాంతః. (ఈదృశమ్) ఈదృశం, ఈదృశౌ, ఈదృశాన్. ఈదృశ శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (త్వామ్) త్వాం, త్వౌ, యువాం, వాం, యుష్మాన్, వః, యుష్మచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. నీల+అంజన+అద్రి, నీలాంజనాద్రి, సవర్ణదీర్ఘసంధి.. ఉత్+నసం, ఉన్నసమ్. అనునాసికసంధి. ఆయత+అక్షం, ఆయతాక్షమ్. సవర్ణదీర్ఘసంధి. శరదః+శతం, శరదశ్శతమ్. శ్చుత్వసంధి.

ఛందోఽలంకారములు. వసంతతిలకా వృత్తము త-భ-జ-జ-గగ లుండవలెయును. స్వభావోక్త్యలంకారము. 'స్వభావోక్తి స్త్వభావస్య జాత్యాది స్థస్య వర్ణనమ్' పరమాత్ముని దివ్యమంగళ విగ్రహ వర్ణనము అప్రాకృత స్వభావమును పొందియుండుట, స్వభావోక్తి.

భావము. ఈ శ్లోకము మొదలుకొని ఎనుబది మూడవ శ్లోకము వఱకును పరమ ప్రాప్యమైన పరమపురుషార్థమునే వచించుచున్నారు. తిరునాడు నందు (పరమపదమున) తిరుమామణి మండపము నందు వేంచేసియున్నట్లుగా భావనాప్రకర్షము తోడి ధ్యానించుచు ఆ దివ్యమంగళ విగ్రహమును అనుభవించుచు అనుగ్రహించుచున్నారు. (నీలాంబుజాది నిభమ్) "పచ్చై మామలై పోల్ మేని" అన్నట్లు గదా అట్టి తిరుమేనున్నది (ఉన్నసమ్) కల్పవృక్షపు తోఁడియూ విసరాగ అని వందేశించుటచేతగా ఉన్నతమైన నాసిక కలవారు. (ఆయతాక్షమ్) దీర్ఘములై విశాలములైన నేత్రములను కలవారు. (ఆజాను చిత్ర భుజమ్) మోకాళ్ళ వఱకును పొడవై జయశీలములై వెలుగు బాహువులు గలవారు. (ఆయత కర్ణపాశమ్) భుజముల వఱకును వ్రేలాడుచున్న కర్ణపాశములను కలవారు. (శ్రీవత్స లక్ష్మణమ్) శ్రీవత్సము అనునది ఒకానొక తెల్లని మచ్చ. ఇది సర్వేశ్వరుని వక్షస్థలమున అసాధారణముగా వెలుగుచుండునది. శ్రీరామాయణమున శ్రీరామచంద్రుని చూచి మండోదరి, చేసిన స్తోత్రమందును "వ్యక్తమేష మహాయోగీ … శ్రీవత్సవక్షా నిత్యశ్రీః" అనియుండుట స్మరింపదగినది. (ఉదార నాభిమ్) నాభికి ఔదార్యమనగా చతుర్ముఖుని ప్రసాదించి అతని మూలముగా ములోకములను ప్రసాదించుట. (దేవ ద్రక్ష్యం త్వాం వరద స్థితం పశ్యేయం) ఇక్కాలము ముందు వఱకును సేవించుదును. "సదా పశ్యన్తి సూరయః" అనబడిన పరమపురుషార్థము దాసునికి లభింపవలయును. అనుచున్నారు. (వరదస్థితమ్) అనునది, మాకెందుకు అను నర్థమున నిలచునది కాదు, "ఇష్టమెల్లా తిరుత్తణిఱుమ్" అను దానివలె గ్రహింపదగినది.

అమ్భోరుహాక్ష మరవిన్ద నిభాఙ్ఘ్రి యుగ్మ
మాతామ్ర తామరస రమ్య కరాగ్రకాన్తి।
భృఙ్గాలకం భ్రమర విభ్రమ కాయకాన్తి
పీతామ్బరం వపు రదస్తు వయం స్తవామ॥ ౬౮.

పదవిభాగము. అంభోరుహాక్షమ్, అరవిందనిభాంఘ్రియుగ్మమ్, ఆతామ్ర తామరస రమ్య కరాగ్రకాంతి, భృంగాలకమ్, భ్రమర విభ్రమ కాయకాన్తి, పీతాంబరం, వపుః. అదః, తు, వయమ్, స్తవామ.

అర్థము. ఓ దేవా! వయం తు= దాసులమో, అంభోరుహ+అక్షం= తామరలవంటి కన్నులు గలదియు, అరవింద నిభాంఘ్రి యుగ్మం= అరవింద నిభ= తామరల తోఁన సమమైన, ~~పాదములు కలదియు~~ అంఘ్రి యుగ్మం= పాదముల జోడు కలదియు, ఆతామ్ర తామరస రమ్య కరాగ్ర కాన్తి, ~~ఎఱ్ఱని~~ ఆతామ్ర తామరస= ఎఱ్ఱని తామరపూవుల వలె, రమ్య= అందమైన, కరాగ్ర= అఱచేతుల యొక్క, కాంతి= కాంతి గలదియు, భృంగాలకం= భృంగ= తుమ్మెదలవంటి, అలకం= కేశములను గలదియు, భ్రమర విభ్రమ కాయకాంతి= తుమ్మెదల యొక్క, విభ్రమ= విలాసము గల కాయం= శరీరము యొక్క, కాంతిః శోభ గలదియు, పీతాంబరం, పీత= పసుపు పచ్చని, అంబరం= వస్త్రమును గలదియునైన, అదః= ఆ, వపుః= తిరుమేనిని, (శరీరమును) స్తవామ= స్తుతించుచున్నాము.

ఆకాంక్ష. స్తవామః= స్తుతించుచున్నాము. కే= ఎవరు? వయం= దాసులమైనమేము. …

ఓ దేవ! వపుః = ఈ తిరుమేనిని,(శరీరమును) వయం, అను ప్రథమాంత కర్తృపదము, వపుః, అను ద్వితీయాంత కర్మపదము, స్మరామః అను క్రియాపదము, ఉన్నవి గనుక సకర్మకకర్తరి ప్రయోగము. వపుః కథం భూతం = తిరుమేను ఎట్టిది? పీతాంబరం = పసుపుపచ్చని వస్త్రముగలది, పునః కథం భూతం, ఇంకను ఎట్టిది? భ్రమర విభ్రమ కాయకాన్తిం = తుమ్మెదల విలాసము గల శరీరకాంతిగలది, భృంగాలకం = తుమ్మెదలవంటి కేశములను గలది, ఆతామ్ర తామరస రమ్య కరాగ్రకాన్తిం = ఎఱ్ఱని తామరపూవుల వలె అందమైన అరచేతుల కాంతిగలది, అరవింద నిభాంఘ్రియుగ్మం = తామరలతో సమానమైన పాదయుగళముగలది, అంభోరుహాక్షం = తామరలవంటి కన్నులనుగలది, దేవ! సంబోధనము.

శబ్దరూప సమాసములు. (అంభోరుహాక్షమ్) అంభోరుహే ఇవ అక్షిణీ యస్య తత్ అంభోరుహాక్షం. తత్ అంభోరుహాక్షమ్. షష్ఠీ బహువ్రీహి. అంభోరుహాక్షం, అంభోరుహాక్షే, అంభోరుహాక్షాణి. అంభోరుహాక్ష శబ్దః అకారాంతః నపుంసక లింగః ద్వితీయైక వచనాంతః (అరవింద నిభాంఘ్రియుగ్మమ్) అరవిందేన నిభం, అరవింద నిభం, తృతీయా తత్పురుషః. అంఘ్రియుగ్మం, అంఘ్రియుగ్మం, షష్ఠీ తత్పురుషః. అరవింద నిభం, అంఘ్రియుగ్మం యస్య తత్, అరవింద నిభాంఘ్రియుగ్మం, తత్ అరవింద నిభాంఘ్రియుగ్మమ్. షష్ఠీ బహువ్రీహి. (ఆతామ్ర తామరస రమ్య కరాగ్ర కాంతి) ఆతామ్ర తామరస మివ రమ్యౌ, ఆతామ్ర తామరస రమ్యౌ. ఉపమాన పూర్వపద కర్మధారయము. కరయోః అగ్రే కరాగ్రే. షష్ఠీ తత్పురుషః. కరాగ్రయోః కాంతిః కరాగ్రకాంతిః. షష్ఠీ తత్పురుషః. ఆతామ్ర తామరస రమ్యా కరాగ్ర కాంతిః యస్య తత్, ఆతామ్ర తామరస రమ్య కరాగ్ర కాంతి. షష్ఠీ బహువ్రీహి. కాంతి, కాంతినీ, కాంతీని, ఆతామ్ర తామరస రమ్య కరాగ్ర కాంతి శబ్దః ఇకారాంత నపుంసక లింగః ద్వితీయైక వచనాంతః. (భృంగాలకమ్) భృంగాః ఇవ అలకాః యస్య తత్ భృంగాలకమ్. షష్ఠీ బహువ్రీహి. భృంగాలకం, భృంగాలకే, భృంగాలకాని. భృంగాలక శబ్దః అకారాంత నపుంసక లింగః ద్వితీయైక వచనాంతః. (భ్రమర విభ్రమ కాయకాంతి) భ్రమరస్య విభ్రమః భ్రమర విభ్రమః, కాయస్య కాంతిః కాయకాంతిః. షష్ఠీ తత్పురుషః. భ్రమర విభ్రమః ఇవ కాయకాంతిః యస్య తత్ భ్రమర విభ్రమ కాయకాంతి, షష్ఠీ బహువ్రీహి. కాయకాంతి, కాయకాంతినీ, కాయకాంతీని. భ్రమర విభ్రమ కాయ కాంతి శబ్దః ఇకారాంత నపుంసకలింగః ద్వితీయైక వచనాంతః. (పీతాంబరమ్) పీతం అంబరం యస్య తత్ పీతాంబరమ్. షష్ఠీ బహువ్రీహి. పీతాంబరం, పీతాంబరే, పీతాంబరాణి. పీతాంబర శబ్దః అకారాంత నపుంసకలింగః ద్వితీయైక వచనాంతః. (వపుః) వపుః వపుషీ, వపూంషి. వపుష్ శబ్దః షకారాంత నపుంసకలింగః ద్వితీయైక వచనాంతః. (అదః) అదః, అమూ, అమూని. అదస్ శబ్దః సకారాంత నపుంసకలింగః ద్వితీయైక వచనాంతః. (తు) అవ్యయము. (వయమ్) అహం, ఆవాం, వయమ్. అస్మచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ప్రథమా బహువచనాంతః. (స్మరామ) స్మరామి, స్మరావ, స్మరామః, స్మృ ఇక్ స్మృతౌ ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది లోట్ ఉత్తమపురుష బహువచనాంతః. అంభోరుహ+అక్షి, అంభోరుహాక్షం, నిభ+అంఘ్రి. నిభాంఘ్రి. కర+అగ్ర. కరాగ్ర, భృంగ+అలకం, భృంగాలకం, పీత+అంబరం. పీతాంబరమ్. సవర్ణదీర్ఘ సంధి.

ఛందోఽలంకారములు. వసంత తిలకావృత్తము. త-భ-జ-జ-గగలు గణములు.

స్వభావోక్త్యలంకారము "స్వభావోక్తి స్స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్" సర్వేశ్వరుని దివ్యమంగళ విగ్రహ వర్ణనము. స్వభావోక్తి.

భావము. క్రిందటి శ్లోకమున దర్శనమును కోరిరి. దర్శింపగనే నోరు మూసికొని యుండుట సాధ్యము కాదు గదా! సాక్షాత్కరించిన ప్రయోజనమును పొందునట్లు నోరారనుభవింప ప్రాప్తమును. అది ఈ శ్లోకమందు చెప్పుచున్నారు. "కట్టురైక్కిల్ తామరై నిన్ కణ్ పాదమ్ కైయవై" వర్ణింపదలచినచో నేత్రములకు హస్తములకు పాదములకు తామర పూవు పోటి కాదు, అని భావించినను, "శెందామరైత్ తడంగణ్ శెంగనివాయ్ శెంగమలమ్ శెందామరై యడిగళ్" ఎఱ్ఱని తామరల వంటి కన్నులు ఎఱ్ఱని దొండపండు వంటి యధరము, ఎఱ్ఱని తామరల వంటి శ్రీపాదములు, అని ఆళ్వారులు వర్ణించినట్లే వీరును "అబ్జం ను కథం నిదర్శనతాం" అని వచించి, 'అబ్జ పాద మరవింద లోచనం పద్మపాణి తలకం' అని యనుగ్రహించుచున్నారుగదా సుందర బాహుస్తవమందు! కనుకనే సర్వేశ్వరుని దివ్యావయవములకు మఱల మఱల తామరలనే పోలికగా చెప్పవలసి యుండుటవలన, 'అంబోరుహ' మనియు 'అరవింద' మనియు 'తామరస' మనియు పదములనే మార్చి మార్చి వర్ణించుచున్నారు.

(భృంగాలకమ్) "శెంగమల పూవిల్ తేనుణ్ణుమ్ వణ్డేపోల్" అని పెరియాళ్వార్ తిరుమొళిని మనస్సున నుంచుకొని అనుగ్రహించుచున్నారు. ముంగురులు ముఖమందు వ్యాపించి యుండుటను భావించినచో ఎఱ్ఱని కమలము నందు తేనెగ్రోలుచున్న తుమ్మెదలు వ్యాపించినవా! అనునట్లుండును గదా! (భ్రమర విభ్రమ కాయకాంతి) తిరుమేను అంతయు తుమ్మెదల కాంతితో నుండును. "తూవియమ్ పుళ్ళుడైత్తెయ్వ వణ్డు" అని సర్వేశ్వరునినే తుమ్మెదగా నమ్మాళ్వార్ వర్ణించినారు గదా! (పీతాంబర) దివ్యమంగళ విగ్రహమునకు పరభాగశోభగా పీతాంబరము నుధరించి యున్నారు. ఇట్టి తిరుమేనిని నోరార మంగళాశాసనము చేయుదుమని చున్నారు.

భ్రూవిభ్రమేణ మృదుశీత విలోకితేన
మందస్మితేన మధురాక్షరయా చ వాచా।
ప్రేమ ప్రకర్ష పిశునేన వికాసినా చ
సంభావయిష్యసి కదా ముఖపంకజేన ॥ ౨౨.

పదవిభాగము. భ్రూవిభ్రమేణ, మృదుశీత విలోకితేన, మందస్మితేన, మధురాక్షరయా, చ, వాచా, ప్రేమ ప్రకర్ష పిశునేన, వికాసినా, చ, సంభావయిష్యసి, కదా, ముఖ పంకజేన.

అర్థము. స్వామీ! భ్రూవిభ్రమేణ = కనుబొమల విలాసము చేతను, మృదుశీత విలోకితేన, మృదు = మెత్తని, శీత = చల్లని, విలోకితేన = కటాక్ష వీక్షణము చేతను, మందస్మితేన = చిఱునగవుతోను, మధురాక్షరయా, మధుర = తీయని (శ్రావ్యమైన) అక్షరయా = అక్షరములు గల, వాచా చ = వాక్కు చేతను, ప్రేమ ప్రకర్ష పిశునేన, ప్రేమ ప్రకర్ష = మనస్సున నున్న ప్రేమాతిశయమును సూచించునట్టి, వికాసినా = వికాసము

ఛందోఽలంకారములు. వసంతతిలకావృత్తము. త-భ-జ-జ-గగలుం గణములు. సంభావనాలంకారము. "సంభావనా యదీత్థం స్యాదిత్యూహోఽన్యస్య సిద్ధయే" సర్వేశ్వరుని దర్శి "స్వామీ! దేవరవారి శ్రీపాదపద్మయుగ్మము, ధ్వజాంకుశ ప్రధానమైన రేఖలతో దాసుని శిరస్సును ఎప్పుడు విందుగా అభిషేకించునో కదా! అని యాచించుచున్నాడు.

భావము. క్రిందటి శ్లోకమున ముఖమండలమువలన చేయు బహుమానమును ప్రార్థించిరి. ఆళ్వారులు ప్రార్థించిన విధముగనే వీరును, రెండు శ్లోకములతో ప్రార్థించుచున్నారు. వజ్రాయుధాత్మకమైన చిహ్నమును, అంకుశ రూపమైన చిహ్నమును, ధ్వజ రూపమైన చిహ్నమును, తామరపూవుగానుండిన చిహ్నమును, పంచాయుధ చిహ్నమును, మత్స్యాకారమైన చిహ్నమును, అమృతకలశరూపమైన చిహ్నమును, కల్పవృక్షాత్మకమైన చిహ్నమును అనునవి, స్వామియందు అమరియుండుట, ఉత్తమ పురుష పాదచిహ్నములుగా శాస్త్రములందు చెప్పబడియుండుట వలనను, సర్వేశ్వరుని శ్రీపాదములందు ఈ చిహ్నములను భక్తులు అనుసంధించుట వలనను, వజ్రాంకుశేత్యాదిగా అనుగ్రహించియున్నారు. అతిమానుషస్తవమందును 'వజ్రధ్వజాంకుశ సుధాకలశాతపత్ర పంకేరుహాంక పరికర్మిత పీతమంఘ్రి" అని యనుసంధించియున్నారు. ఆళవందారును (యామునులు) 'శంఖ రథాంగ కల్పక ధ్వజారవిందాంకుశ వజ్ర లాంఛనమ్" అని అనుగ్రహించినారు. భట్టరు కూడ శ్రీరంగరాజస్తవమున "వజ్రారవింద ధ్వజ ఛత్ర కల్పక శంఖ చక్రేత్యాదిగా అనుసంధించియున్నారు. ఇట్టి రేఖాత్మకములైన వీనిచేత అలంకరింపబడిన దేవరవారి పాదారవిందయుగళము, కాంతి ప్రవాహములతో దాసుని తలను ఎప్పుడు అభిషేకము చేయునో! యని విన్నవించినారు.

త్రైవిక్రమక్రమకృతాక్రమణ త్రిలోక
ముత్తంస ముత్తమ మనుత్తమ భక్తిభాజామ్।
నిత్యం ధనం మమ కదా హి మదుత్తమాంగ
మంగీకరిష్యతి చిరం తవ పాదపద్మమ్॥ 71.

పదవిభాగము. త్రైవిక్రమ క్రమ కృతాక్రమణ త్రిలోకం, ఉత్తంసం, ఉత్తమం, అనుత్తమ భక్తి భాజాం, నిత్యం, ధనం, మమ, కదా, హి, మదుత్తమాంగం, అంగీకరిష్యతి, చిరం, తవ, పాదపద్మమ్.

అర్థము. ఓ స్వామీ! త్రైవిక్రమ క్రమ కృతాక్రమణ త్రిలోకం, త్రైవిక్రమ = త్రివిక్రమునిసంబంధమైన, క్రమ = కొలుచుటచేత, కృత = చేయబడిన, ఆక్రమణ = ఆక్రమింపబడిన, త్రిలోకం = మూడులోకములను గలదియు, అనుత్తమ భక్తి భాజాం, అనుత్తమ = గొప్పవారైన, భక్తి భాజాం = భక్తిగలవారికి, ఉత్తమం = గొప్పదైన, ఉత్తంసం = శిరోభూషణమైన, మమ = దాసుడైన నాకు, నిత్యం = శాశ్వతమైన ధనం = సంపదగానున్న, తవ = దేవరవారి (నీ యొక్క) పాదపద్మం = శ్రీపాదారవిందమును. మదుత్తమాంగం = దాసుని (నాయొక్క) తల, చిరం = నిత్యమును, కదా = ఎప్పుడు, అంగీకరిష్యతి = అంగీకరించునో!

ఆకాంక్ష. అంగీకరిష్యతి = అంగీకరింపగలదో! కిం = ఏది? మదుత్తమాంగం = దాసుని (నాయొక్క) తల, కిం = దేనిని? తవ పాదపద్మం = దేవరవారి యొక్క (నీయొక్క) శ్రీపాదారవిందమును.

యదా ఎప్పుడు. కదా ఎప్పుడు, మదుత్తమాంగం, అను ప్రథమాంత కర్మపదము, తవ పాదపద్మం, అను ద్వితీయాంత కర్మపదము, అంగీకరిష్యతి, యను క్రియా పదము. ఇన్నది గనుక సకర్మక కర్తరి ప్రయోగము. పాదపద్మం కథంభూతం = దేవర వారి పాదారవిందమెట్టిది? నిత్యం ధనం = శాశ్వతమైన ధనసంపద గానున్నట్టిది. కస్య ఎవనికి మమ = దాసుడనైన నాకు, పునః కథంభూతం = ఇంకను ఎట్టిది? ఉత్తమం ఉత్తంసం = శిఖ్యాన శిరోభూషణమైనది. కేషాం = ఎవరికి అనుత్తమ భక్తి భాజాం = గొప్పదైనట్టి భక్తి గలవారికి, పునః కథంభూతం = ఇంకను ఎట్టిది? త్రైవిక్రమ క్రమ కృతాక్రమణ త్రిలోకం = త్రివిక్రమునికి సంబంధించిన కాలు చాచుట చేత చేయబడిన ఆక్రమించబడిన ముల్లోకములు గలది.

శబ్దరూప సమాసములు. (త్రైవిక్రమ క్రమ కృతాక్రమణ త్రిలోకమ్) త్రివిక్రమ సంబంధీ త్రైవిక్రమః. త్రైవిక్రమ శ్చాసౌ క్రమ శ్చ త్రైవిక్రమ క్రమః. విశేషణ పూర్వపద కర్మధారయము. త్రైవిక్రమ క్రమేణ కృతం, త్రైవిక్రమ క్రమ కృతం, త్రైవిక్రమ క్రమ కృతం చ తత్ ఆక్రమణం చ, త్రైవిక్రమ క్రమ కృతాక్రమణం, విశేషణ పూర్వపద కర్మధారయము. త్రైవిక్రమ క్రమ కృతాక్రమణం త్రిలోకం యేన తత్, త్రైవిక్రమ క్రమ కృతాక్రమణ త్రిలోకమ్. తృతీయా బహువ్రీహి. త్రయాణాం లోకానాం సమాహారః త్రిలోకమ్ (సమాహార ద్విగువు. త్రిలోకం, త్రిలోకే, త్రిలోకాని, త్రైవిక్రమ—త్రిలోక శబ్దః అకారాంత నపుంసక లింగః ద్వితీయైక వచనాంతః, (ఉత్తంసం) ఉత్తంసం, ఉత్తంసౌ, ఉత్తంసాన్, ఉత్తంస శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైక వచనాంతః. "పుంస్యుత్తంసావతంసౌ ద్వౌ కర్ణపూరేపి శేఖరే" ఇత్యమరః. (ఉత్తమం) ఉత్తమం, ఉత్తమౌ, ఉత్తమాన్, ఉత్తమ శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైక వచనాంతః. (అనుత్తమ భక్తి భాజామ్) అవిద్యమానా ఉత్తమా యస్యా స్సా, అనుత్తమా, పంచమీ నఞ్ బహువ్రీహి. అనుత్తమా చ సా భక్తిశ్చ అనుత్తమ భక్తిః, విశేషణ పూర్వపద కర్మధారయము. అనుత్తమ భక్తిం భజన్తే ఇతి అనుత్తమ భక్తి భాజః. తేషాం, అనుత్తమ భక్తి భాజామ్. ఉపపద సమాసము. భక్తిభాక్, భక్తిభా~~[illegible]~~జౌ, భక్తిభాజామ్. అనుత్తమ భక్తిభాక్ శబ్దః జకారాంతః పుంలింగః షష్ఠీ బహువచనాంతః. (నిత్యమ్) నిత్యం, నిత్యే, నిత్యాని, నిత్యశబ్దః అకారాంతః నపుంసకలింగః ద్వితీయైక వచనాంతః. (ధనమ్) ధనం, ధనే, ధనాని, ధన శబ్దః అకారాంత నపుంసకలింగః ద్వితీయైక వచనాంతః. (మమ) మమ మే, ఆవయోః, నౌ, అస్మాకం, నః. అస్మచ్ఛబ్దః దకారాంతః పుంలింగః షష్ఠ్యేక వచనాంతః (కదా) అవ్యయము. (హి) అవ్యయము. (మదుత్తమాంగమ్) మమ ఉత్తమాంగం, మదుత్తమాంగమ్. షష్ఠీ తత్పురుషము. మదుత్తమాంగం, మదుత్తమాంగే మదుత్తమాంగాని. మదుత్తమాంగ శబ్దః అకారాంత నపుంసక లింగః ప్రథమైక వచనాంతః. (అంగీకరిష్యతి) అంగీకరిష్యతి, అంగీకరిష్యతః, అంగీకరిష్యన్తి, డుకృఞ్-కరణే- ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది లృట్ ప్రథమ పురుషైక వచనాంతః. (చిరం) అవ్యయము. "చిరాయ చిరరాత్రాయ చిరస్యాద్యాశ్చిరార్థకాః" ఇత్యమరః. (తవ) తవ, తే, యువయోః, వాం, యుష్మాకం, వః, యుష్మచ్ఛబ్దః దకారాంతః పుంలింగః షష్ఠ్యేక వచనాంతః. (పాదపద్మమ్) పాదపద్మం, పాదపద్మే, పాదపద్మా,

అవధారణార్థకావ్యయము. పాదపద్మం, పాదపద్మే, పాదపద్మాని. పాదపద్మ శబ్దః అకారాంత నపుంసకలింగః, ప్రథమైకవచనాంతః. కృత+ఆక్రమణాన్వితాక్రమణ. ఉత్తమ+అంగం, ఉత్తమాంగమే, సవర్ణదీర్ఘసంధి. మమ+ఉత్తమాంగం, మదుత్తమాంగమే ఉత్వసంధి.

ఛందోలంకారములు. వసంతతిలకావృత్తము త-భ-జ-జ- గగలుండవలయును. సంభావనాలంకారము " సంభావనా యదీత్థం స్యాదిత్యూహో న్యస్య సిద్ధయే" సర్వజ్ఞుని పాదపద్మము, దాసుడైన నాశిరస్సును శిరోభూషణముగా అలంకరింపగలదోకదా! అని ఊహించుట. ఇందు శబ్దాలంకారముకూడ అనుప్రాసముకలదు. "త్రైవిక్రమక్రమ క్రాంతాక్రమణత్రైలోక్యమ్, ఉత్తంసముత్తమమనుత్తమ భక్తిభాజామ్. ఉత్తమాంగమంగీకరిష్యతి" అను పదములలో గమనింపదగును.

భావము. దేవరవారి ముల్లోకములను కొలిచిన బంగారు పాదములను నాతల, నిత్యశేఖరముగా ధరించుట యెన్నడో! అనుచున్నారు. ముల్లోకములను అవలీ-లయల్లసం కొలుచుకొనిన శ్రీపాదములకు మాహాత్మ్యమైన దాసుని తల ఆస్పదము కాకూడదా! సకలశ్రేష్ఠమైన భక్తియే రూపుదాల్చిన ఆళ్వారులకును ఆళవందార్(యామునులు) వంటి ఆచార్యులకును శిరోభూషణములై యున్న శ్రీపాదములను నేనుసైతము, ఏయోగ్యతయులేని దాసుడను కోరుట, తగినది కాకున్నను, బాపలముచేత ఆశపడుచున్నాను. క్షమింపవలయును. అనునది అంతర్భావము

ఈ శ్లోకమందు పాదపద్మమును కర్తగా నుంచి, తనతలను కర్మపదముగా చేసి, దేవరవారి పాదారవిందము నాతలను ఎప్పుడు అంగీకరింప గలదు, అని కొందరు అర్థమును చెప్పుచూచెదరు; అది పొసగదు. అట్లైన రెండవ పాదమందు 'ఉత్తంసం' అనునది కుదురదు. ఎందుకనగా-ఆ శబ్దము, నిత్యపుంలింగమగుట వలన 'ఉత్తంసః పాదపద్మమే' అనియే యుండవలయును. 'పాదపద్మమే' అనుదానిని వ్యత్యయాంతముగా భావించి యనుగ్రహించుటవలన 'ఉత్తంసమే' అనునదియు వ్యత్యయాంతమై యుపపన్నమగును.

ఉన్నిద్ర పత్ర శతపత్ర, సగోత్ర మంత
ర్లేఖారవింద మభినందన మింద్రియాణామ్।
మూర్ధ్ని హంత! కరపల్లవ తల్లజం తే
కుర్వన్ కదా కృతమనోరథయిష్యసే మామ్॥ 72.

పదవిభాగము. ఉన్నిద్ర, పత్ర శతపత్ర సగోత్రం, అంతర్లేఖారవిందం, అభినందనం, ఇంద్రియాణాం, మూర్ధ్ని, హంత, కరపల్లవ తల్లజం, తే, కుర్వన్, కదా, కృతమనోరథయిష్యసే, మామ్.

అర్థము. స్వామీ! ఉన్నిద్ర పత్ర శతపత్ర సగోత్రం, ఉన్నిద్ర= వికసించిన, పత్ర= రేకులుగల. శతపత్ర= తామరపూవుతో, సగోత్రం= సమానమైనదియు, అంతర్లేఖారవిందం= లోపలిభాగమందు రేఖారూపమైన పద్మమును గలదియు, ఇంద్రియాణాం=

సకలేంద్రియములకు, అభినందనం = ఆహ్లాదమును కలిగించునట్టిదియునైన తే = దేవర వారియొక్క (నీయొక్క) కరపల్లవతల్లజం = చిగురాకుతో సమానమైన అరచేతిని, మమ మూర్ధ్ని = దాసుని యొక్క (నా యొక్క) తల యందు, కుర్యాః = ఉంచుచున్నవారై (రై) మాం = దాసుని (నన్ను) కృతమనోరథ యిష్యసి కదా = పరిపూర్ణ మనోరథము గలవానిని ఎప్పుడు చేయుదురో (వో).

ఆకాంక్ష. కదా కృతమనోరథ యిష్యసి = ఎప్పుడు పరిపూర్ణ మనోరథము గలవానినిగా చేయుదురో (వో) కదా. కః = ఎవరు (డు) త్వం = దేవర వారు (నీవు) కం = ఎవనిని మాం = దాసునిని (నన్ను) కిం కుర్యాః = ఏమి చేయుచున్నవారగుచు, కరపల్లవతల్లజం, మమ మూర్ధ్ని కుర్యాః = చిగురాకుతో సమానమైన అరచేతిని దాసుని (నా) తల యందు, ఉంచుచున్నవార (వై) అనుచు, త్వం, అను ప్రథమాంత కర్తృ పదము, మాం, అనెడి ద్వితీయాంత కర్మ పదము, కదా మనోరథ యిష్యసి, అను క్రియాపదము ఉన్న విధముగ సకర్మక కర్తరి ప్రయోగము. కస్య కరపల్లవ తల్లజం, ఎవరి యొక్క అరచేయిని, తే = దేవర వారి (నీయొక్క) యొక్క కరపల్లవ తల్లజం కథం భూతం = అరచేయి ఎట్టిది. సర్వేంద్రియాణాం అభినందనం = సకలేంద్రియములకును ఆహ్లాదమును కలిగించునది. పునః కథం భూతం = ఇంకను ఎట్టిది. అంతర్నిఖారవిందః = లోపల భాగమందు రేఖారూపమైన పద్మము గలది. పునః కథం భూతం = ఇంకను ఎట్టిది. ఉన్నిద్ర పత్ర శతపత్ర సగోత్రం = వికసించిన రేకులుగల తామరపూవుతో సమానమైనది.

శబ్దరూపసమాసములు. (ఉన్నిద్ర పత్ర శతపత్ర సగోత్రం) ఉన్నిద్రాణి పత్రాణి యస్య తత్ ఉన్నిద్ర పత్రం, షష్ఠీ బహువ్రీహి. ఉన్నిద్ర పత్రం చ తత్ శతపత్రం చ ఉన్నిద్ర పత్ర శతపత్రం. విశేషణ పూర్వపద కర్మధారయము. ఉన్నిద్ర పత్ర శతపత్రస్య సగోత్రం, ఉన్నిద్ర పత్ర శతపత్ర సగోత్రమ్. షష్ఠీ తత్పురుషము. సగోత్రం, సగోత్రే, సగోత్రాణి, ఉన్నిద్ర పత్ర శతపత్ర సగోత్ర శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (అంతర్నిఖారవిందమ్) అంతః ~~రేఖా యస్య తం~~ రేఖారూపం అరవిందం యస్య సః అంతర్నిఖారవిందః, తం. అంతర్నిఖారవిందమ్ షష్ఠీ బహువ్రీహి. అంతర్నిఖారవిందం, అంతర్నిఖారవిందౌ, అంతర్నిఖారవిందాన్ అంతర్నిఖారవింద శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (అభినందనమ్) అభినందనం, అభినందనే, అభినందనాని. అభినందన శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః (ఇంద్రియాణామ్) ఇంద్రియస్య, ఇంద్రియయోః ఇంద్రియాణామ్. ఇంద్రియ శబ్దః అకారాంత నపుంసకలింగః. షష్ఠీ బహువచనాంతః, (మమ మూర్ధ్ని) మమ మూర్ధా. మమ మూర్ధ్నా. షష్ఠీ తత్పురుషము. వసిష్ఠే, మమ మూర్ధ్ని, మమ మూర్ధ్నోః, మమ మూర్ధ్నోః, మమ మూర్ధసు. మమ మూర్ధన్ శబ్దః నకారాంతః పుంలింగః సప్తమ్యేకవచనాంతః. (కాంత) అవ్యయము. (కర

